ఐ=దమయంతిని మున్నిడుకొన్నవారై, వచ్చి. వారించి=ఆటంకపెట్టియుం, కలి సమావేశపరవశుఁడు ఐన=కలిపురుషునియొక్క చొచ్చుటచే నొడలుమఱచిన వాఁడయిన, అన్నలుచేతన్, ప్రతిహతులై=ఆపఁబడినవారయి పలుకకుండిరి. అంతన్=అప్పుడు, దమయంతి, చింతాక్రాంతచిత్త ఐ=దుఃఖముచే నావరింపఁ బడిన మనస్సుకలదై (మనోదుఃఖముతో నిండినదై)

61. ఎంత=ఎంతదూరము, ఓటువడినన్=ఓడిపోయిన, అంతియ = అంతమాత్రమె, జూదమునందున్, తగులు=ఆశయుం, చలము=పట్టుదలయుం, అతిశయిల్లున్=హెచ్చును. ఏమిచేయుదానను=నేనేమి చేయఁగలను. ఇది= ఈజూదము, ఎగ్గునకున్, కీడునకు, మూలము=కారణము, అని, లతాంగి=దమ యంతి, దుఃఖితాత్మ అగుచున్ = మనస్సున దుఃఖము నొందినదియై

62. అక్షములు=పాచికలు, పుష్కరునందున్=పుష్కరునికి, (షష్ఠ్యర్థంబున సప్తమి), వశ్యంబులు ఐ-అధీనములై, ఉనికియున్ = ఉండుటయుం, నలునియందున్=నలునకు, (ఇదియుం షష్ఠ్యర్థమున సప్తమి.) ఒండువిధములు అగుటయున్=వేఱు తీరుగలవిగ నుండుటయు, ఎఱిఁగి, నిజ అధీశ్వరునకున్= తనమగనికి, అపజయము కా=ఓటమియే అగునట్లు, లక్షించి=ఊహించి, సరసిజ అక్షి=తమ్మిఱేకులంబోలుకన్నులుగలదగు దమయంతి, మున్=ముందుగా, భర్త యనుజ=పెనిమిటి యనుజ్ఞను, పడసి = పొంది, వార్ష్ణేయుఁడు, అనుసారథిన్, పిలిచి. ఈస్యందనమునన్=ఈరథంబునందు, ఇంద్రసేనుఁడు అను ఇక్ష్వాకుమారకున్=ఇంద్రసేనుఁ డనెడి యీచిన్నికొడుకును, ఇంద్రసేన అనుకూఁతున్= కుమారితను, చెచ్చెరన్ ఆ=వేగమే, తోడుకొని, విదర్భకున్ = విదర్భాపురికి అరిగి, గుఱుకొని=యత్నించి, మత్-బంధుజనులయొద్దన్ = నాచుట్టములకడ, పెట్టి=విడిచి, సరఁగన్ = వేగముగా, రమ్ము. అటంచున్ = అని చెప్పుచు, పంచి = ఆనతిచ్చి, ఆప్తపురోహితమంత్రిబాంధవ అభిమతమున్=ఇష్టులయుం పురోహితులయుం మంత్రులయుం బంధువులయుం అభిప్రాయమును, పొంది (సారథిన్). పుచ్చెను = పంపెను.

63. నలుఁడును, ధరణీరాజ్యమున్ = పుడమియు రాజ్యమును, తలఁగఁగన్=పోఁగా, సర్వంబును=యావత్తును, అపహృతంబు ఐనన్ = దోఁచుకొనిపోఁబడఁగా, కడున్=మిక్కిలి, తలరి = భయపడి (చింతించి), అశేషరాజ్యవిభవచ్యుతుఁడు ఐ = రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొన్నవాఁడై, దమయంతిన్, తోడ్కొని, వెలువడియెన్ = పట్టణమును విడిచిపెట్టెను.

64. పురము వెలిన్ = పట్టణమునకు వెలుపట, మూఁడు అహోరాత్రములు=మూఁడుదినములు, వసించియున్న, నలు పాలికిన్ = ఆనలమహారాజునొద్దకు, జనవిభుఁడు-ఐన-పుష్కరుశాసనమునన్ = రాజగు పుష్కరుని యానతివలనను, కలికృ...మునన్-కలి=కలిపురుషునిచేత, కృత=చేయఁబడిన, ద్యూత=జూదమువలని,విద్వేష కారణమునన్=విరోధ మను కారణమువలనను, ఎవ్వరును=ఒక్కఁడైనను, అరుగన్=పోవుటకు, ఓడిరి = భయపడిరి.

65. ఇట్లు, సర్వజనసత్కార అర్హుఁడు అయ్యున్ = జనులందఱి యొక్క మర్యాదలకుఁ దగినవాఁడయినను, నలుఁడు, విధివశంబునన్ = దైవవశమువలన, ఎవరివలనన్, సత్కారము = మర్యాద, కానక, జలంబు=నీళ్లే, ఆహారము కాన్=ఆహారము కాఁగా, తత్పురసమీపంబున్=ఆపట్టణముచేరువ, దమయంతీ ద్వితీయుండై = దమయంతియే రెండవదిగాఁ గలవాఁడై, ఉండి, ఖుత్పీడన్=ఆఁకలిబాధను, సహింపక ఓపక=ఓర్వఁజాలక, హిరణ్యపక్షంబులతోన్=బంగారుఱెక్కలతో, తనముందటన్=తనయెదుటతిరుగుచున్న, పక్షులన్, కని, అవి = అపక్షులు, భక్ష్యములు అగును అని = తినఁదగినవని, ఆపక్షులన్, పట్టికొనన్=పట్టుటకు, సమకట్టి = పూని, తనకట్టిన పుట్టంబు = తాను తాల్చినవస్త్రము, వానిపైన్ = ఆపక్షులమీఁద, వైచినన్=వేయఁగా, అవి. పుట్టంబుతోన్ అ = వస్త్రముతోనే, గగనంబునకున్=ఆకాశమునకు, ఎగసి=ఎగిరి, నగుచున్ = నవ్వుచు, విగతవస్త్రుఁడు ఐన = కట్టబట్ట లేనివాఁడగు, నలునికి, ఇట్లనియె.

66. పార్థివేంద్రా = ఓరాజాధిరాజా, నీధనంబును, రాజ్యంబును, నిక్కృతిన్=కపటముతో కొన్న, అక్షములము=పాచికలము, ఏము, నీవస్త్రము,

అపహరింపన్, పక్షిరూపులము ఐ వచ్చి అపహరించితిమి, అని, చెప్పి, చదలన్ = ఆకాశమందు, అరిగెన్ = పోయెను.

67. నలుండును, వానిన్=ఆపక్షులను, చూచి, విస్మయము = ఆశ్చర్యము, అంది, ఈయక్షంబుల దోషంబునన్ కాక=ఈపాచికలద్రోహమువలననే తప్పు, ఏమి, నాకున్, ఇట్టిది, అయ్యెను. (ఈపాచికలవలననే నాకింత యనర్థము సంప్రాప్తమయ్యెను.) అనుచున్ దమయంతి, కట్టిన,పుట్టంబుచెఱంగు= కట్టుకొన్న చీరపైటకొంగును, కట్టికొనియెను. అట్లు, ఇరువురు = ఇద్దఱు, ఏకవస్త్రులు ఐ = ఒంటిబట్టకట్టినవారై, ఒండొరుల మొగంబులు, చూచి, దుఃఖించుచుండన్, నలుఁడు, దమయంతికిన్, ఇట్లనియెను.

68. ఇది, దక్షిణాపథంబునకున్ = దక్షిణదేశమునకు, ఇదియొండె = మఱియొక్కటి, విదర్భాపురంబునకున్, ఇది, కోసలకున్ = కోసలదేశమునకు, ఇది, ఉజ్జయినికిన్=ఉజ్జయినీపట్టణమునకును, తెరువులు = మార్గములు, మదిన్=మనసులో, ఇన్నిటిలోనన్ = ఈ దారులలోన, మనకున్=మనము. ఎద్ది = ఏదారి, అరుగన్ అగున్ = పోవఁదగును.

69 ఇందుముఖీ=చంద్రబింబముఁ బోలుమోము గలదానా, అడవుల లోనన్, నాతోన్, కడున్ ఇడుమలు=ఎక్కువకష్టములు, పడన్ ఓపవు = అనుభవింపఁజాలవు. ఇప్పుడు, నీబంధుజనంబులకడకున్ = నీచుట్టాలదగ్గఱకు, అరుగుము. అనవుడున్ = అని చెప్పగా, తరుణి = (అగు) దమయంతి, శోకగద్గద = వ్యసనముచే డగ్గుత్తిక కలది, అగుచున్.

70. అతనికిన్, ఇట్టులు, అనియెన్, అవని ఈశ = పుడమిఱేడా, నీవును, నేనున్, చని, విదర్భన్ = విదర్భయందు, ఇష్టలీలన్ = ఇచ్ఛావిహారములతో, ఉండుదము. మృగా...వనంబులకున్ - మృగ=క్రూరజంతువుల చేత, ఆకుల=నిండిన, ఉగ్ర=భయంకరమైన, వనంబులకున్ = అడవులకు, అరుగన్ ఏల=పోవనేల, ఇడుమలు=ఆపదలు, అందన్ ఏల=పడుట ఎందుకు?

71. అనినన్, విని, నలుఁడు, అవనతఆననుఁడు ఐ=తలవంచుకొన్న వాఁడై, నీచెప్పినయట్లు = నీమాటప్రకారమె, విదర్భేశ్వరురాజ్యంబును = విదర్భరాజ్యమును, మనరాజ్యంబు అ = మనరాజ్యమే, ఏను. తొల్లి, అధిక ఐశ్వర్యయుతుఁడను ఐ = ఎక్కువకలిమితోఁ గూడినవాఁడనై, అందులకున్ = ఆవిదర్భకు, పోయి, బంధుజనులకున్ = చుట్టాలకు, హృదయ ఆనందము = మనస్సంతోషము, చేసి, ఇప్పుడు, ఇవ్విధంబునన్, సర్వహీనుండను ఐ = అంతయుఁ బోఁగొట్టుకొని, ఎట్లు, పోవనేర్తును = పోవఁగలను. అనినన్, దమయంతి, ఇట్లు అనియెను.

72. ఎందున్=ఎచ్చటను, అఖిలదుఃఖరోగ ఆర్తునకున్=సకలములైన వ్యసనములను వ్యాధులచేత పీడింపఁబడినవానికి, ఔషధంబు=మందు, భార్య అ చూవె=పెండ్లాము సుమా. ఒనరన్=చక్కఁగా, భార్యాసమేతుఁడు ఐ= పెండ్లముతోఁ గూడినవాఁడై, ఉన్నవానికిన్, ఎంతలు ఆపదలు=ఎంత శ్రమములు, అయ్యెను = కలిగినను, ఎఱుకపడవు = తెలియరావు.

73. ధరణీతలనాథ = ఓపుడమిఱేఁడా, అలయునెడన్=పనిచేయుటచే నలపుచెందునపుడును, డయ్యునెడన్=దారినడక మొదలగువానిచే శ్రమపడునపుడును, ఆఁకలియును, తృషయున్=దప్పియు, పొనయెడన్=కలిగినప్పుడును, కనుఁగొని=కనిపెట్టి, భార్యయు, పురుషునకున్=మగనికి, చిత్తమునన్= మనస్సునందు, దుఃఖంబుల్=వ్యసనములు, ఇమ్ములన్=చక్కఁగా, పాచున్= తొలఁగించును.

74 కావున, ఇది=ఈదమయంతి, మత్-అధీనజీవిత=నాకు లోఁబడిన ప్రాణముగలది, అనియున్, అనువ్రత=నావంటి నియమమునుగలది, అనుసరించినది అనియు, అనుకంపనీయ=దయచూపఁదగినది, అనియున్, నన్నున్, విడువక, నా అనుగమనంబునకున్=నేను వెంబడివచ్చుటకు, అనుమతుండవు కమ్ము = అంగీకరింపుము. అనినన్, అట్లు అ = అలాగునే చేయుదును, ప్రాణసమానవు = నాప్రాణములకు సమానురాలవు, అయిన. నిన్నున్, ఏల, విడుతును,

ఓడక ఉండుము=వ్యసనపడకుండుము. అని నలుఁడు, దమయంతిన్, ఆశ్వాసించుచున్=ఓదార్చుచు, ఒక్కటన్=కూడ, చనిచని=పోయిపోయి, విజనంబు = ఏకాంతము ఐన, విపినంబునన్=అడవియందు, ఒక్క సభన్=ఒక రచ్చకొట్టమును, కని, అందున్ = దానియందు, విశ్రమించి = దిగి, పరుష ధూళిధూసరస్థలంబునన్-పరుష=కఱకైన, ధూళి=దుమ్ముచే, ధూసరిత=పొగ వర్ణము గలదిగా చేయఁబడిన, స్థలంబునన్=తావునందు, శయనించి, మార్గ శ్రమనిమీలిత నయనుండు ఐ-మార్గశ్రమ=దారినడకవలని యలసటచే, నిమీలిత=మూసికొన్న, నయనుండు అయి=కన్నులుగలవాఁడై, దుఃఖంబునన్ = వ్యసనముచేత, కన్ను మొగుడకున్నన్=నేత్రములు మూఁతపడకయుండఁగా-నిద్ర రాకయుండఁగా, లేచి=కూర్చుండి, తన పాదముల అంతికంబునన్=తన కాళ్లవద్ద, అతిక్లేశపరవశ అయి = ఎక్కువదారిబడలికచే సొక్కినదై, నిద్ర పోయెడు దమయంతిన్, చూచి.

75. ధరణిరాజ్యంబుతోన్ = భూమిపరిపాలనముతోఁ గూడ, ధనము ఎల్లన్=ద్రవ్యమంతయును, పరులచేన్=శత్రువులచేత, అపహృతంబు, అగుటయున్=అపహరింపఁబడుటయు, ఆప్త...జనంబులున్-ఆప్త=హితము దెల్పువారు, మిత్ర=చెలికాండ్రు, బంధుజనంబులున్=చుట్టములును, ప్రకృతిజనంబులున్=మంత్రులును, విడుచుటయును = విడిచిపెట్టుటయు, మహావిపిన భూమిన్=కాఱడవియందు, పత్నితోన్=భార్యతో, తన పరిభ్రమియించుటయున్=తాను దిరుగుటయు, అప్డు, తలఁచి, శోకించి=దుఃఖించి, ఈతరుణి=ఈజవ్వని, తొల్లి, మృదుశయనంబునన్ = మెత్తనిపాన్పునందు, మెలఁతలు= చెలికత్తెలు, మెలపుతోన్ = జాగ్రత్తతో, అడుగులు ఒత్తన్ = కాళ్లు పిసుకఁగా, నిద్ర అనుభవించు=నిద్రపోవునట్టి, కోమల అంగి=మృదుశరీరముగలది, ఇపుడు, గుఱుకొని=శ్రమపడి, పాంసుస్థలమునందున్=దుమ్ముతో నిండిన తావునందు, నిద్రన్ తగిలినదియున్ =నిద్ర చెందునదియు, పంకజాక్షి=తామర రేకులంబోలు కన్నులు గలది యగు, ఈచాన, నాకున్, భార్య, ఐ, దైవ ఘటనన్ చేసి=గ్రహాచారమువలన, ఇంత దుఃఖంబున్, పొందెను.

76. ఏను, దీనిదుఃఖంబుఁ, జూడనోపను = చూడఁజాలను. ఎటకే నియుఁ=ఎచ్చటికేనియు, పోయెదను. ఇది, నన్నుఁ, గానక, తనబంధుల యొద్దకుఁ, పోయి, దుఃఖపడక, ఉండును అని, విచారించి=తలపోసి, పోవఁ, సమకట్టి=పూని, ఆకోమలి మేలుకొనకుండఁ, మెల్లన=తిన్నఁగా, దానివస్త్రంబు నందుఁ, అర్ధంబు=సగము, చించి, తనకుఁ, పరిధానంబు=కట్టుబట్టగా, చేసి కొని, వెలువడి=బయలుదేఱి, కొండొకనేలపోయి=కొంతదూరంబు చని, దమ యంతియందుఁ, తన నెయ్యంబు అను తీఁగ=తన ప్రేమ యనెడితీఁగను, త్రెంపఁ, నేరక=చాలక, క్రమ్మఱ=మరల, అచ్చోటికిఁ, వచ్చె.

77. కలి=కలిపురుషుఁడు, దమయంతిఁ, పాపఁ=విడిపించిపోవునట్లు చేయుటకు, సమకట్టుఁ=పూనును. సతిఁ=పతివ్రతయైన, అలలను=అసుంద రిని, అన్నలుఁడు, దీర్ఘసౌహృదబలంబునఁ=విస్తారమైన చెలిమియొక్క శక్తి చేత, పాయఁ ఓపఁడు=విడిచిపోవఁజాలఁడు. ఇట్టుల=ఇవ్విధంబున, రెంటఁ చేసి=కలిబలప్రేమబలమువలన, విమోహరజ్జులఁ = మోహ మనెడి త్రాళ్ల యందు, పెనఁగి=మెలివడి, గత ఆగత కారి=వచ్చుటపోవుటలను చేయునట్టి, ఐన=అయిన, ఉయ్యెలయుఁ పోలెఁ=ఉయాలవలె, ఊఁ ఆడక = నిలుకడ నొందక, ఎంతయుఁ ప్రొద్దు=దీర్ఘకాలమునకు, ఐనిశ్చితాత్ముఁడై=మనమున నిర్ణయము చేసికొన్నవాఁడై. (పై పద్య. అన్వ.)

78. బాలఁ = ధైర్యములేనిదియగు నీ దమయంతిని, ఒక్కర్తుఁ= ఒంటరిగా, ఇక్కానపాలుచేసి = ఈయడవిపాలుచేసి, నిష్ఠురుఁడను ఐ=దయ మాలినవాఁడనై, ఏను, ఎట్లు, పోవఁ నేర్తును=పోవఁజాలుదును. అనక=అని తలఁపక, కలిచేతఁ, ఆకృష్టుఁడు=ఈడ్వఁబడినవాఁడు, ఐన నలుఁడు, విగత కరుణుఁడు ఐ = దయమాలినవాఁడై, దమయంతిని, విడిచి, చనియెఁ, వెళ్లి పోయెను.

79. అంతఁ=తర్వాత, దమయంతి, మేలుకని=నిద్రలేచి, తనపతిఁ, కానక=చూడక, తనవస్త్రఅర్ధనికర్తనంబునుఁ = తనచీరలో సగము చింపు

బడియుండుటను, చూచి, లేచి, నలుగడలును=నాలుగుదిక్కులును, పరికించి= వెదకి, భయశోకవ్యాకులచిత్త ఐ = భీతిచేతను దుఃఖముచేతను గలవరపడిన మనస్సుగలదై.

80. హా మహారాజ=ఓరాజేంద్రుఁడా, మహా...రాతి-మహాత్ = గొప్పదైన - విశాలమైన, మహీ=భూమియొక్క, రక్షణ=పాలించుటయందు, దక్ష=నేర్పుగలదైన, దక్షిణబాహా = కుడిచేతిచేత, దండిత=శిక్షింపఁబడిన, అరాతి=శత్రువులు గల, నిషధరాజాగ్రణి = మేటియైన యోనిషధదేశాధినాథా, నన్ను, ఇట్లు, వీతదయుండవై =దయలేనివాఁడవై, విడిచిపోవన్ =విడిచిపెట్టి పోవుట, తగును ఎ=యుక్తమా. నీవు, ఎన్నఁడున్, ధర్మువున్ =న్యాయమును, తప్పనివాఁడవు. సూనృతవ్రతరతుండవు = నిక్కము పలుకుటయే ప్రధానవ్రతముగాఁ గలవాఁడవు, ఓడకుము=భయపడకుము. అని, నన్నున్, ఊఱడన్ =నిమ్మళించునట్లు. పలికినపలుకు=చెప్పినమాట, మఱవన్ కన్ =మఱచుట, పాడి అయ్యె=న్యాయమటయ్యా, పొదలలోనన్ =తీఁగలగుంపులందు, దాఁగి, పొడసూపక = కనఁబడక, ఇట్లు, ఏల=ఎందుకు, ఉన్నవాఁడవు. ఇట్టి ఉగ్రభావము=కఠలాటి కటికతనము, ఏల=ఎందుకు, నీకున్, అయ్యెన్ =కలిగెను. ఎటన్ = ఎచ్చటికి, పోదును. ఇంకను, ఉగ్రకాననమునన్ = భయంకరారణ్యమునందు, నిన్నున్, ఎట్లు, కాంతును=చూడఁగలను.

81. వగవన్ కన్ =యోచింపఁగా, సాంగ ఉపాంగములు=ఆఱంగములు ఆఱు ఉపాంగములు కూడిన, నాలుగువేదములయు=నాలుగువేదముల యొక్కయు, అధ్యయనము = చదువుట, పొల్పుగాన్ =సరిగా, ఒక సత్యముతోన్ = సత్యమైనమాటను నెఱవేర్చుటతో, ఎన అగునే = సాటియగునా. ఎవ్వియున్ =ఎట్టిసత్కార్యములును, సత్యంబున్ = నిక్కము మాటాడుటను, పోలవు అంటె = తూఁగవఁట. సత్యవాక్యము నెఱవేర్పుతో నేమియు సమానములు గావు.

82. ప్రాణసమానవు=ప్రాణములతో సాటివి, అయిన నిన్నున్, అవశ్యంబును=తప్పకను, విడువను, అని, పలికితివి. సత్యప్రతిపాలనంబు=ఆడినమాట

జాలివేర్పుటను, చేయుము. అని ప్రలాపించుచున్ = ఏడ్చుచు, తనవికారిత్వంబునకున్ = ఒంటరితనమునకు, అబలభావంబునకున్ = తనయాఁడుతనమునకు, ప్రతిపద...భయంబునకున్ - ప్రతిపదన్యాస = ఒక్కొక్క యడుగెత్తిపెట్టునప్పుడును, జాయమాన=పుట్టుచుండు, కంటక=ముండ్లు, మృగ = మృగములు, పన్నగ = పాములు, వీనివలని, భయంబునకున్ = వెఱపునకు, వగవక=చింతింపక, నిజనాథు నసహాయత్వంబునకున్=తన పెనిమిటి తోడు లేమికి, దుస్సహా...త్వంబునకున్ - దుస్సహా = ఓర్వరాని, క్షుత్=ఆఁకలి, పిపాసా=దప్పి, వీనివలనఁ గలిగిన, శ్రమ = బడలికచేతనైన, ఆకులత్వంబునన్=కలవరపాటునకు, వగచుచున్=చింతించుచు. (పై పద్య. అన్వ.)

83. అలయుచున్ = బడలికచెందుచు, పులుఁగుల యెలుఁగులకున్ = పక్షులకూఁతలకు, ఉలుకుచున్ = భయపడుచు, ఉగ్ర ఆతపమునకున్ = తీక్ష్ణమైన యెండకు, ఓపక=ఓర్వఁజాలక, వృక్షంబులనీడలన్=చెట్లనీడలయందు, నిలుచుచున్, ఎలుఁగులన్ = ఎలుఁగుబంట్లను, పులులను, చూచి, భయమున్ కొని=వెఱచి, వగవగచున్ = చింతించును.

84. లతాంగి=తీఁగవంటి మేనుగల దమయంతి, ఏచినపొదలన్ = క్రిక్కిఱిసి యున్నపొదలను, పడల్పడన్=ప్రోగులుపడునట్లు. త్రోచుచున్, ముండ్లకున్, అల్ల=మెల్లఁగా, దూరముగా, తొలఁగుచున్, దిక్కులుఅనలు వైపులు. చూచుచున్, తొడరుచున్=తొట్రుపడుచు, త్రెళ్లుచున్=క్రిందఁబడుచు, లేచుచు, సంచలించుచున్=వణఁకుచు, అరిగెన్=పోయెను.

85. ఇట్లు, అరుగుచున్న దమయంతి, అంతికన్యస్తచరణ అయినన్ = సమీపమునందుంపఁబడిన పాదములు గలదికాఁగా, సమీపమున పాదము లెత్తిపెట్టఁగా, దానిన్ = అదమయంతిని. ఆహార అర్థి ఐ=ఆహారముకు గోరినదై, ఒక్క పన్నగంబు=ఒక పాము, పట్టికొనినన్=పట్టఁగా, ఆకోమలి=ఆమెత్తని మేనుగల దమయంతి, మెదల నేరక = కదలఁజాలక.

86. ఇంకన్ వినన్=ఇఁక మీఁద నైనను, నన్నున్ = నామొఱను, ఏల, ఆలకింపవు=వినవు. నాథ=నా ప్రాణరక్షకా, నాకున్, శరణము అగుము= రక్షకుఁడ వగుము. అనుచున్, అఱచుచున్నన్ = కూయుచు డఁగా, దాని ఆక్రందనధ్వని=దానియార్పు చప్పుడును, వినుచున్, ఒక్క ఎఱుకు = ఒక ఎఱుకువాఁడు, వేగ = త్వరగా, వచ్చి.

87. తనపట్టిన సురియన్=తాను ధరించిన కత్తిచేత, ఆ పెనుఁబాము వదనంబు = ఆకొండచిలువయొక్క నోటిని, వ్రయ్యన్=చీలునట్లు, తఱిగి నన్=నఱుకఁగా, రాహుముక్త అయిన చంద్రరేఖయున్ పోలెన్=రాహువు నోటినుండి విడువఁబడిన చంద్రరేఖవలె, అజగరముఖంబువలనన్ = కొండ చిలువయొక్క నోటినుండి, వెలువడిన=విడిపించికొనివచ్చిన, దమయంతిన్, ఆశ్వాసించి=ఊఱడించి, తత్ సమీప...స్నాతను - తత్=ఆప్రదేశమునకు, సమీప = దాపున నున్న, సరోవర = దివ్యమైనకొలనియందు, స్నాతను = స్నానము చేసినదానిని, వన్య...హారను గాన్ - వన్య = అడవియందు దొర కెడి, స్వాదు=తియ్యని, ఫల = పండ్లు, ఆహారముగాన్ = ఆహారముగాఁగల దానినిఁగా చేసి, సేదతీర్చి=శ్రమ పాపి, నీవు, ఎవ్వరిదానవు = ఎవ్వరికి సంబం ధించినదానవు, ఏకతంబ=ఒంటరిగా, ఇవ్వనంబునకున్, ఏల వచ్చితివి, అని, అడిగి మృదుభాషిణి=తిన్నగా మాటాడునది. ఐన ఆకోమలివలనన్, అంత వృత్తాంతంబు=సంగతియంతయు, ఎఱింగి=తెలిసికొని.

88. రజనికర ఆననన్ = చంద్రునివంటిముఖము కలదియు, మేచక కుంతలరాజితన్=నల్లనికురులచేఁ బ్రకాశించునదియు, విలసద్గజపతిగామినిన్= గొప్ప యేనుఁగువలెఁ దిన్నఁగా నడుచునదియు, చందనగంధిన్=శ్రీచందనము వంటి మేనితావిగలదియు, ప్రకాశితకాంతిసమన్వితన్=వెలిఁగెడి కాంతితోఁ గూడినదియు, పంకజదళలోచనన్=తామరఱేకులంబోలిన కన్నులుగలదియు నైన, రాజసుతన్ = రాజపుత్రికయగు దమయంతిని, చూచి, కిరాతుఁడు= ఎఱుకువాఁడు, కామ...హతుఁడై - కామ = మన్మథునియొక్క, నిశాత =

వాఁడయైన, శర = అమ్ములచేత, ఆహతుఁడై = బాగుగా కొట్టఁబడినవాఁడై, అనింద్యచరిత్రుఁడు=పొగడఁదగిన నడవడికల, లతాంగికిన్ = దమయంతికి, వేడుకతోన్=అపేక్షతో, నిజహృదయంబు = తనమనస్సులోని యభిప్రాయమును, ఎఱిఁగించెన్ = తెలిపెను.

89. అగ్నిశిఖయుంబోలెన్ = నిప్పుమంటవలె, అంటుటకు = తాఁకుటకును, డాయుటకు=దగ్గరకువచ్చుటకును, చూడన్=చూచుటకును, రానియట్టి = వలనుపడని దగు, శుభచరిత్రన్=పావనంబైన నడవడికల యాదమయంతిని, ఎఱుక=జ్ఞానము, లేని మూటికఅను ఎఱుకు = లేనట్టి క్రూరుఁడైన బోయవాఁడు, కాదు అనక=పరస్త్రీనిఁ గోరుట తగ దని యోచక. తలఁచెన్. ఆయువు=జీవితకాలము, అల్పము ఐనన్=తక్కువపడఁగా, అపేక్షించెన్=కోరెను.

90. దమయంతియున్, వానిన్=ఆ యెఱుకువానిని, అలిగి చూచి= కోపముతో చూచి, ఏను, పతివ్రతను. ఐతిని, ఏని, ఇద్దురాత్ముఁడు=చెడుతలంపు గలవాఁడు, ఐన కిరాతుండు. మృతుండు, అయ్యెడున్ అని = చచ్చునుగాక యని, శాపంబు, ఇచ్చినన్, వాఁడు, అప్పుడు అ = తత్క్షణముననే, అగ్నిదగ్ధంబు ఐన వృక్షంబునుంబోలెన్=నిప్పుచేఁ గాలినచెట్టువలె, విగతజీవుండు ఐ = ప్రాణము పాసినవాఁడయి, పడియెన్, క్రిందఁబడియెను. అట్లు, పరమపతివ్రతాత్వ ప్రభావంబునన్=ఎక్కువయైన పాతివ్రత్యమహిమ చేత.

91. బాల=ముద్దియయగు దమయంతి, హృదయమునన్ = మనస్సునందు, నృపశార్దూలున్=రాజులలో శ్రేష్ఠుఁడైన, నిజాధీశున్ = తనభర్తను నిలిపి, దుష్ట...వళికిన్ - దుష్ట=చెడ్డ, ఉరగ = పాములు, శార్దూల=పులులు, ఆభీల = క్రూరములైన, మృగ ఆవళికిన్ = మృగముల గుంపునకు, భయము, అందక, ఓలిన్ అ=క్రమముగానే, ఉగ్ర అటవిలోన్=భయంకరమైన యడవిలో, అరిగెన్=పోయెను.

92. మఱియున్ = ఇంకను.

93. సహకార=తియ్యమామిడిచెట్టా, మత్ప్రియసహకారున్=నాకు నెయ్యపుఁజెలికానిని, పున్నాగ=సురపొన్నచెట్టా పున్నాగున్=పురుషులలో

సు త్తముని, తిలక = ఓతిలకవృక్షమా, భూభువనతిలకుఁ=భూలోకంబునకుఁ దిలకముమాడ్కిఁ బ్రకాశము గలిగించువానిని, చందన = ఓగంధపుఁజెట్టా, బుధవారిచందనుఁ=పండితులకుఁ గల్పవృక్షమువంటివానిని, పుష్పితాశోక= పూచిన యశోకవృక్షమా, సుహృజ్జనశోకదమనుఁ = ప్రేమించువారిదుఃఖమును బోఁగొట్టువానిని, వకుళ=పొగడచెట్టా, కుల ఏక దీపకుఁ = కులమున కంతటికి ముఖ్యప్రకాశకుని, విభీతక = ఓతాండ్రచెట్టా, భయ...హరుఁ- భయ=వెఱపుచేత, భీత=దిగులుపడినవారియొక్క, ఆర్తి=బాధలను, హరుఁ= పోఁగొట్టువానిని. కాన=ఓియరణ్యమా, లోకోత్తరుఁ=జనులలో నుత్తముని, ప్రీతితోడఁ=ప్రేమతో, కానరు ఏ కానరు ఏ=చూచితిరా చూచితిరా, అని, తోయజాక్షి=కమలములంబోలు కన్నులుగలదమయంతి, మ్రాని మ్రానికిఁ = చెట్టుచెట్టునకు, అరిగి అరిగి=పోయి పోయి, అడుగును. అడుగులు=అఱకాళ్లు, ఎండవడిఁ=ఎక్కువయెండకు, పురపురఁ=పురపురమని, పొక్కఁ=బొబ్బలు లేవఁగా, నిర్ఝర అంతరములఁ = సెలయేళ్ల నడుమ, నిలుచుఁ=నిలఁబడును. తరులగిరుల యెడలఁ = చెట్లయొక్కయు కొండలయొక్కయు సందులందు, పొలుచుఁ=కనుపట్టును. ఉరుగుహాగృహములఁ = గొప్పవైన గుహ లనెడి గృహములయందు, తొంగితొంగి చూచుఁ.

94. ఇట్లు దమయంతి, నిజనాథుఁ = తనమగనిని, అన్వేషించుచుఁ=వెదకుచు, భీషణ అరణ్యంబునఁ = భయంకరమైన యడవియందు, తిరుగునది=సంచరించుచు, ముందటఁ=ఎదుట. (పై పద్య. అన్వ.)

95. అంభోరుహ అక్షి=తమ్మిఱేకులవంటి కన్నులు గలదియగు దమయంతి, వారిభక్షులు=నీళ్లే యన్నముగాఁగలవారును, పర్ణభక్షులు = ఆకులే యాహారముగాఁ గలవారును, వాయుభక్షులు = గాలియే యాహారముగాఁగలవారును, శాకనీవారభక్షులు=కూరగాయలను నివ్వరిధాన్యము నాహారముగాఁ గలవారును, వృక్ష...సక్తులు-వృక్షమూల=చెట్లమొదళ్లయందు, నివాస=ఉండుటయందు. సక్తులు=ఆసగలవారును. ఐ, తపంబు=తపస్సు, అరఁ=తృప్తిగా, చేయు, మహాముని ఇంద్రుల యాశ్రమంబు=మహర్షుల తపోవనంబును, పురా

సమార్జిత పుణ్యకర్మఫలంబునన్ = తొలిమేన సంపాదింపఁబడిన పుణ్యకర్మల యొక్క ఫలములచేత, ఎదన్ = దవ్వునందు, కాంచెన్ = చూచెను.

96. ఇట్లు, మృగ...నిరంతరంబు - మృగ = జంతువులు, వ్యాళ = పాములు, తస్కర=దొంగలు, కిరాత=బోయలు, పర్వత=తిప్పలు వీనిచే, నిరంతరంబు=దట్టమైనది, అయిన కాంతారంబునన్ = అడవియందు, పుణ్యనదీ తీరంబునందున్=పరిశుద్ధమైన యేటిగట్టునందు, ఒక్కమునిపల్లెయందున్=ఒక ముని యాశ్రమంబున, వసిష్ఠ...సదృశులు ఐన=వసిష్ఠుఁడు, వామదేవుఁడు, వాలఖిల్యుఁడు, భృగువు, నారదుఁడు వీరితో సమానులైన, మహామునులన్ = గొప్పఋషులను, కని, నమస్కరించి, ఉన్నన్ = వారియెదుటను నిలువఁబడి యుండఁగా, ఆమునులు, దమయంతిన్ జూచి, అచ్చెరువడి=ఆశ్చర్యమునొంది, అవ్వా=అమ్మా! నీవు, ఎవ్వరిదానవు=ఎవని భార్యవు, ఈవనదేవతవే, దేవ భామినివిపి=అచ్చరవే, దివ్యంబు=శ్రేష్ఠము, అయిన ఈతేజంబుతోన్, ఏల శ్రమ్మ రెదవు=తిరిగెదవు, అనినన్, వారలకున్, దమయంతి, ఇట్లు, అనియెన్.

97. వినుఁడు, ఏన్, ధరిత్రిన్ = పుడమియందు, పుణ్యశ్లోకుఁడు, అనఁగన్ = అనునట్లును, సదా = విడువక, యజ్ఞనిరతుఁడు = యాగములు చేయుటయందు శ్రద్ధగలవాఁడు, అనఁగన్ = అనునట్లును, తనరిన = ఒప్పిన, నలుని భార్యను, సజ్జనునకన్=సత్పురుషులచేఁ గొనియాడఁబడుదానను, దమయంతి అనఁగన్ చాలినదానను = దమయంతి యను పేరుతో నొప్పుదానను.

98. విధికృతంబునన్ = దైవవశంబుచేత, నన్నున్, పాసి=వదలి, హృదయ ఈశ్వరుఁడు=నామనోనాయకుఁడు. ఎటకేనియున్ = ఎచ్చటికో, పోయినన్=పోఁగా, తత్...చిత్తను ఐ-తత్ = ఆనామనోవల్లభునియొక్క, అన్వేషణ=వెదకుటయందు, ఆసక్త=తగులుగలిగిన, చిత్తనై = మనస్సుగలదాననై, విపిన పరిభ్రమణంబు=అడవియందుఁ దిరుగుట, చేసెదను. ఈతపోవనంబునకున్ = ఈయాశ్రమమునకు వచ్చి, నలుఁడు, భవ...ర్థుండు అయి -

భవత్=తమయొక్క, పాద=వాళ్లకు, అభివందన = మ్రొక్కుటచేత, కృతార్థుఁడు అయి=ధన్యుఁడై, ఎక్కడకుక్=ఏతట్టునకు, పోయెన్, అతని పోయిన వలను = అతఁడు పోయిన దిక్కు, ఎఱుఁగుదురేనిన్ = (మీరు) తెలిసికొని యుందురేని, ఆనతిండు = తెలుపుఁడు. కొన్నిదినములలోనన్ = స్వల్ప కాలములోపల, తద్దర్శనంబు = అతని పోఁబడి, దొరకనిసాఁడు, దేహంబు విడుతును. అని, ఏడ్చుచున్నదానిన్, చూచి, కరుణించి = దయకలఁచి, మునులు = ఋషులు, ఇట్లు, అనిరి.

99. వనజ ఆయత అక్షీ=తామరఱేకులమాడ్కి విశాలమైన కన్నులు గలదానా. లివిరి=ప్రయత్నపడి, భూజననుతున్=పుడమియందలి సకల జను లచేఁ గొనియాడఁబడువానిని, ఎప్పటియట్టుల = యథాప్రకారముగా, తన పురమునన్=తన పట్టణమునందు, తనరెడువానిన్=ఒప్పినవానిని, నలునిన్, కతిపయ దినంబులన్ = కొన్నిదినములలోపల, చూడంగన్, కాంతువు = చూడఁగలుగుదువు.

100. మేము, తపోదృష్టిన్=జ్ఞానదృష్టిచేత, చూచితిమి=కనుగొం టిమి. దుఃఖింపక ఉండుము. అని, తాపసులు, తమ యగ్నిహోత్రంబులతోన్, అపార...లతోన్-అపార=విస్తారమైన, ఫల=పండ్లచేతను, పుష్ప = పూల చేతను నిండిన, తరు=చెట్లతోఁగూడిన, నదీ=ఏళ్లచేత, రమ్య=అందమైన, తపో వనంబులతోన్, తారు = ఆమునులు, అదృశ్యులు ఐనన్=కనఁబడకపోఁగా, చూచి, దమయంతి, ఇది, కలయో, నిక్కువంబో=నిజమో అని, విస్మయంబు, అందుచున్=వింతపడుచు, చని, ముందటన్ = ఎదుట, ఒక చనుపన్=ఒక్క బిడారును, కని, దానిన్, చూచునపుడు, అందలి జనంబులు. (వైపద్యముతో నన్వయము.)

101. పాంసుజాలంబు=ఎక్కువ దుమ్ము, పైన్=మీఁద, ప్రాఁకినన్= క్రమ్మఁగా, కరము=మిక్కిలి, రూక్షములు=బిరుసులు, అయిన, ఊర్ధ్వ అలక ముల వానిన్=పైకిరేఁగిన ముంగురులుగలదానిని, అతిమలినంబు = మిక్కిలి మాసినది, ఏనఅర్ధవస్త్రంబునన్=సగముకోకచేత, ఆవృతంబు = కప్పఁబడినది,

అగు, దేహయష్టిదానిన్=దండమువంటి దేహముగలదానిని, ఆఁకలి, తృష = దప్పి. నిద్ర, అనువానిన్, ఎఱుఁగక ఉన్మాదినియుంబోలెన్ = ఉన్మాదరోగము గలదానివలె, ఉన్నదానిని, దమయంతిన్, చూచి, అందున్ = వారిలో, పిశాచంబు = దయ్యము, అని, పఱచిరి = పరుగెత్తిరి కొందఱు, భయమున్, పొందిరి. కొందఱు, అధికహాసంబు చేసిరి = పకపక నవ్విరి. అడవిన్=అడవిలో, ఏమి రోసెదు = వెదకెదవు. (అని) కొందఱు, అనిరి. కొందఱు, నీవు. వేల్పవు=దేవతవు, ఔదువు, అని మొగిన్ ఆ=పూనికతోనే, కేలుమొగిచి=చేతులు ముడిచికొని. మ్రొక్కిరి. అంతన్=అటుతర్వాత.

102. దమయంతియుఁన్, సార్థవాహులన్ = బిడారును, చూచి, ఇమ్మహాగహనంబునన్ = ఈగొప్పయడవియందు, ఇట్టి జనసంకులంబు=జనులచే నిండినది, అయిన, సార్థంబు=బిడారు, కానంబడియెను. ఎట్టిపుణ్యంబో= ఏమి నాపుణ్యమో, అనుచున్, వారలకున్, ఇట్లు, అనియెన్.

103. ఏను, నలుభార్యను, పుణ్యవిహీనతన్=పాపముచేత (పుణ్యఫలంబు లేకపోవుటచేత), పతిన్=భర్తను, పాసి, నవసి=దిగులుపడి, ఏకాంతముగ=ఒంటరిగా, ఈకానలన్=ఈయడవియందు, పరిభ్రమించెదను=తిరుగులాడుచున్నాను. అమరసదృశున్ = వేల్పులతో సాటియైనవానిని, కరుణాత్మున్=దయాస్వభావముగలవానిని, నలున్, కానరె=చూడలేదా.

104. అనినన్, దమయంతికిన్, ఆసార్థవాహాధ్యక్షుఁడు=ఆబిడారుయొక్క యజమానుఁడు, శుచి అనువాఁడు, ఇట్లు, అనియెన్.

105. ఇవ్వనంబునన్, నలున్, కానము = (మేము) చూడలేము. ఎప్పుడును, ఉగ్రకరులన్=భయంకరములైన యేనుఁగులను, సింహంబులన్, ఋక్షంబులన్ = ఎలుఁగుబంటులను, కాంతుము ఇది = ఈయడవి, మర్త్యులకున్ = మానవులకు, అవిషయము = చొఱరానిది, దీనన్ = ఈయరణ్యమందు, ఆతపంబు = ఎండ, దూరదు = ప్రవేశింపదు.

106. అనినన్=అని చెప్పఁగా, ఇచ్చునుప = ఈబిడారు, ఎటన్, పోయెదున్, అని, అడిగినన్, ఇది ఈబిడారు, చేదిపతి = చేదిదేశపురాజు, అగుసుబాహుపురంబునకున్=సుబాహువుయొక్క పట్టణమునకు, పోయెదును, అని, చెప్పినన్, అట్లు ఏని=అలాగైనట్టయితే, ఏను, మీతోడన్, వచ్చెదను, అని, పరమపతివ్రత=మహాపతివ్రతయగు దమయంతి, పతిదర్శనలాలస ఐ = భర్తను జూచుటయం దాతురరాలై, మునులపలుకులు, తలంచుచున్,సార్థవాహ సమూహంబులతోడన్=బిడారుతోఁగూడ, అరిగినన్=వెళ్లఁగా.

107. ఆచనుప = ఆబిడారు, కడున్ = మిక్కిలి, ఎండ, ఎక్కువంతకున్=ఎక్కువంతవఱకు, ఉడుగక=నిలువక, ఉగ్రాటవిలోన్=భయంకరమైన యడవియందు నడచి, బహుశీతజలములన్ = మిక్కిలి చల్లనినీటిచేత, పెడఁగు = రమ్యము, అగు, ఒకచెఱువు ఒద్దన్ = సొంపయిన యొక చెఱువు గట్టున, పెద్దయుఁన్, మిక్కిలి, దప్పిన్=దాహముచేతను, విడిసెన్=దిగెను.

108. అంతన్ = తరువాత.

109. అర్ధరాత్రమునప్పుడు=సగమురాత్రియందు, అందులకున్ = ఆచెఱువులోనికి, గజయూథములు = ఏనుఁగులగుంపులు. జలకాంక్షన్ చేసి = నీరువట్టుచేత, అంబుధివిమలజలంబులు=సముద్రమునందలి నిర్మలములైన నీళ్లు, ఆస్వాదింపన్=త్రాగుటకు, చనుదెంచు జలధరసమితి యట్లు=వచ్చునట్టి మేఘపంక్తియో యనునట్లు, ఏతెంచెను=వచ్చెను. ఈచనుపలోనన్=ఆబిడారులో, నిద్రాసక్తులు ఐ=నిద్రయందుఁ జిక్కినవారై, మైమఱచి నిద్రించువారై, ఉన్నవారు, ఉన్నతద్విపముల ఉగ్రపాదహతిన్ చేసి-ఉన్నత=ఎత్తైన, ద్విపములు=ఏనుఁగులయొక్క, ఉగ్ర=గొప్పవైన, పాద = కాళ్లయొక్క, హతిన్ చేసి=త్రొక్కుడువలన, భిన్నఅంగులుఁ=చేతులు, కాళ్లు మొదలగునవి విఱిగినవారు, ఐరి. అందున్ = వారిలో, ఉక్కుఅడఁగి = ధైర్యముపీడి, కొందఱు, ఆఱచిఁచూఁతలుపెట్టి, ప్రాణభీతిన్ = ప్రాణములు పోవునవెడి భయముతో,

పఱచి = పరుగెత్తి, మహీజములు=చెట్లు, ఎక్కి=రి, చనుక=బిడారు, పెనుపు అటి = సంతోషముపీడి, అవికీతుసిరి అ పోరెక్ = అడఁకువలేనివానిసంపద కైవడి, అడఁగి=తగ్గి, విరిసి=చిందరవందరయై, చనిరెక్ = పోయెను.

110. అట్టి సంక్షోభంబుగన్=అట్టి కలవరపాటునందు, మరణంబు నకున్ తప్పి=చావునుండి తప్పించుకొని, దమయంతి, ఆత్మగతంబునన్=తన మనస్సులోపలనే. (పై పద్య. అన్వ.)

111. విధి=దైవము, జీవిత ఆర్థులు ఐన=బ్రతుకుటయందపేక్ష గలవారగు, జీవులన్ = ప్రాణులను, సుకసుప్తులు ఐనవారిన్ = హాయిగా నిద్రించు వారిని, అణవన్ అణపన్ = (వారు) కూఁతలు వెట్టుచున్నను, చంపెను. మరణకాంక్షన్ = చావఁగోరికతో, ఉన్న, మగువన్ = స్త్రీనైన నన్నున్, చంపఁగన్=చంపుటకు, మఱచెను. (అది=ఆవిధి) కరంబు=మిక్కిలి, మందబుద్ధి = బుద్ధిలేనిది.

(విధి చావనున్నవారిని జంపక, బ్రతుకఁగోరువారిని జంపెను గనుక మూఢబుద్ధిగలవాఁడని దమయంతి విసుగుచే దైవమును దూఱెను.)

112. ఈచన్పతోన్ = ఈబిడారుతోఁగూడ, చని = వెళ్లి, ఈవన క్లేశంబున్ = ఈయరణ్యవాసదుఃఖంబు, తలఁగుదును = పాయుదును అని, బుద్ధిన్=మనస్సునందు, తలఁచి, ఉన్నన్ = ఉండఁగా, ఉరుతరసార్థపయో రాశి-ఉరుతర=మిగుల గొప్పదైన, సార్థ=వర్తకుల బిడారనెడి, పయోరాశి= సముద్రము, హస్తియూథ అగస్త్యుచేన్=ఏనుఁగులగుంపనెడి యగస్త్యమహా మునిచేత, పీతము అయ్యెన్=త్రాఁగఁబడెను. (తొల్లి అగస్త్యమహాముని పుడిసిలితో త్రాగి, సముద్రమున బొట్టునీరుకూడ లేకుండఁ జేసెనఁట. అట్లె యా యేనుఁగుల గుంపు బిడారునంతయుఁ గాలిక్రింద వేసి త్రొక్కి చంపివేసెను. కనుక బిడారంతయు నిహతమాయెనని తా.రూపకాలంకారము.)అదియున్ =అట్లగుటయు, తొలుమేనన్=ముందటి జన్మమునందు, దుష్కృతశక్తియో= పాపబలమో, వగవంగన్ = యోచింపఁగా, నాన్వయంపరమునాఁడు =

సాపేంద్రియశ్వాసము, సురవరులు=దేవతలలో మేటులగు ఇంద్రాదులు, అర్థులై = నన్నుఁ గోరినవారై, చూచుచుఁన్, ఉండఁగన్, నలున్, వరియించిన నాఁటి యొగ్గు=కోరిననాఁటి తప్పిదమును, తలఁచి, వేల్పులు, ఇట్టి యాపదలు= ఇట్టికష్టములు, చేసిరి ఓ=కలిగించిరో, అమరకోపమునన్ అ=దేవతల యాగ్రహముచేతనే, ఈవియోగదుఃఖము=ఈయెడఁబాటువలనివంత, నాకున్, కలిగెను. ఇంకన్, ఏమి, చేయుదును, అనుచున్, అంబుజాక్షి=తమ్మికంటి, వగచుచున్ ఉండెన్=దుఃఖించుచుండెను.

113. ఇట్లు దుఃఖించుచు, దమయంతి, ప్రభాతంబు ఐనన్=తెల్లవాఱఁగా, హతశేషులు అయినవారలతోన్=చావఁగా మిగిలినవారితో, అనవరతప్రయాణంబులన్=ఎడతెగనిదారినడకలచేత, చేదిపతిపురంబు=చేదిరాజు పట్టణంబును, చొచ్చి=ప్రవేశించి, జనసంకులంబు జనులచేఁ గిక్కిఱిసినది, అయిన, రాజమార్గమున్ = రాచబాటను, కదిసియున్=సమీపింపఁగా, వచ్చుచున్న దానిన్=వచ్చునదియు, దినకర...సరంబు-దినకర=సూర్యునియొక్క, ప్రభా=కాంతులయొక్క, పటల=సమూహముచేత, ధూసరంబు=తెల్పునల్పువన్నెగలసినది, అయిన, దివాతనచంద్రరేఖయున్ పోలెన్ = పగటిపూఁట నుండెడి చంద్రరేఖవలె, దీప్తివిహీనయై=కాంతిలేనిదై, దస్సియున్=అలసట నొందియు, రమ్య ఆకృతి ఐనదానిని = చక్కనిరూపముగలదియునైన యాదమయంతిని, ప్రాసాదతలగత = మేడమీఁదనున్నది, ఐన, రాజమాత=రాజు తల్లి, ఆదమయంతిన్, దవ్వులన్ = దూరముననె, కని, తనదాదికిన్ = తన దాదితో, ఇట్లు, అనియెన్.

114. ధూళిధూసర అలకములు=దుమ్ముచే నిండినముంగురులు, తూఱుచుండన్=రేఁగియుండఁగా, జీర్ణమై=చినిఁగినదై, కడున్=మిక్కిలి, మాసిన చీరన్, కట్టి, అబల=ఓ కానోకపడుచు, ఉన్మత్త వేషిణి=పిచ్చివేషము ధరించినది, ఐన లచ్చియున్ పోలెన్ = లక్ష్మీదేవివలె, ఇటన్ = ఇచ్చటికి, వచ్చుచున్నది. దానిన్, కంటె=కంటి+ఎ = కంటివి ఎ = చూచితివా.

115. ఆకోమలియందున్ = ఆచిన్నదానియందు, నాకున్, అతిస్నేహంబు=ఎక్కువప్రేమ, అయినయది=కలిగినది. దానిన్, తోడ్కొని=పిల్చుకొని, రమ్ము, అనినన్, అదియుఁన్=ఆదాదియు, దమయంతిన్, తోడ్కొని=పిల్చుకొని, రాజమాతయొద్దకున్=రాజుగారితల్లియొద్దకు, చనినన్ = పోఁగా, రాజమాతయుఁన్, దానిన్, చూచి, నీవు, ఎవ్వరిదానవు = ఎవ్వనిభార్యవు. ఇట్లు, ఏల, దుఃఖ ఆవేశ వివశవు = దుఃఖముయొక్కపూనికచే, పరవశవు, అయి=ఉన్నదానవు, చెప్పుము. అనినన్. దమయంతి, ఇట్లు అనియెన్.

116. అవ్వ=ఓయమ్మా! జితవైరి = శత్రువుల గెల్చువాఁడయిన, మత్పతి=నామగఁడు, జూదము ఆడి, నిర్జితుఁడు ఐ=ఓడినవాఁడై, చనినన్ = (అడవులకు) రాఁగా, పతితోడన్ = మగనితోడ, నీడయుఁన్ పోలెన్=నీడవలె, నేనును, పాయక=విడువక, అరిగి, అతిబుభుక్షా ఆతురుండు = ఎక్కువయాఁకలిచే డస్సినవాఁడు, ఐనపతిచేతన్, దైవ అనుమతిన్ చేసి = దైవము ప్రోత్సాహమువలన, వంచితనైతిని = మోసపుచ్చఁబడితిని. ఒక్కచోన్, మఱచి, నిద్రించి. (పై కు. అ.)

117. అంతనుండియుఁన్=అది మొదలుకొని, ఆమ్మహానుభావున్=ఆ మహాసమర్థుని, ఏకవస్త్రున్ = ఒంటిబట్ట గట్టినవానిని, అతిమనోహరున్ = మిగులనందమైనవానిని, అన్వేషించుచున్=వెదకుచు, సైరంధ్రీవ్రతంబున్ = పనికత్తెవలె నలంకారములు మొదలగునవి లేకుండుట యనునియమమును, చేకొని=పూని, వియోగ అనలంబునన్=పతివిరహ మనెడి యగ్నితాఁకుడుచేత, కంది=మాడి, కందమూలఫలంబులు అ = గడ్డలు, దుంపలు, పండ్లుమాత్రమే, ఆహారంబు గాన్=ఆహారముకాఁగా. ప్రొద్దుపడినచోటు అ = అస్తమయమైన తావే, నివాసంబుగాన్ = ఉనికిపట్టుకాఁగా, మృగంబులు అ = అడవిజంతువులే, సహాయంబుకాన్=తోఁడుకాఁగా, వనంబునన్=అడవియందు, పరిభ్రమించెదను = తిరిగెదను. అని, బాష్పజలంబులన్ = కన్నీళ్లచేత, ఉరస్స్థల పరాగంబు = ఱొమ్మునందుఁ బడినదుమ్ము, పంకంబుచేయుచున్ = బురద

యగునట్లు చేయుచు, పలుకక, ఉన్నన్, ఆదమయంతికిన్, రాజమాత, ఇట్లు, అనియెన్.

118. ఇందీవరదళనేత్ర=నల్లగలువలం బోలు కన్నులు గలదానా, నీవు, నాకడన్, ఉండుము, (నేను) నీపతిని, రోయంగన్ = వెదకుటకు, భూదేవ ఉత్తములన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, పనిచెదను = పంపెదను, నావుడున్ = అని చెప్పఁగా, భీమునందన = దమయంతి, నెమ్మిన్ = ప్రేమతో, అనియెన్.

119. ఏను, సైరంధ్రీవ్రతంబు, చేకొని యుండెదను=పూనియుండెదను. ఉచ్ఛిష్టంబు = ఎంగిలి, భుజియింపను=తినను. పదధావనంబుచేయను = (పరపురుషుల) కాళ్లు కడుగను, పరపురుషులతోన్, పలుకనోపను = మాటలాడఁజాలను. పతిన్ = భర్తను, అన్వేషించుపొంటెన్ = వెదకునిమిత్తమై, అరిగెడు బ్రాహ్మణులతోన్, పలుకుదును. అట్లు ఐనన్=నీవు ఈ ప్రతిజ్ఞల కొప్పుకొంటివేని, నీయొద్దన్, ఉండుదును. ఒండువిధంబు ఐనన్ = వేఱువిధముగానున్నను, ఉండనేరను=(నీకడ)ఉండఁజాలను. అనినన్, రాజమాత, సంతసిల్లి, నీకున్, ఇష్టంబు ఐనవిధంబునన్ అ=ఇచ్ఛ-చొప్పుననే, నాయొద్దన్ అ=నావద్దనే ఉండుము- అని, దానిన్=ఆదమయంతిని, అతిగౌరవంబునన్=ఎక్కువ మర్యాదతో, చేకొనియుండన్ = ఉంచుకొనుటకు, తనకూఁతున్, సునంద యనుదానిన్=సునంద యనుపేరుగల తనకూఁతును, సమర్పించినన్ = సహాయముగా నియ్యఁగా.

120. నలుదేవి=నలునిపట్టపుదేవి యగుదమయంతి, చైద్యేశుపురిన్= సుబాహుని పట్టణంబునందు, ఎదన్ = మనస్సునందు, పతిన్ = భర్తను, తలఁచుచున్, దుస్స...ర్దిత ఐ-దుస్సహా=ఓర్వరాని, వియోగ=ఎడఁబాటనెడి, తాప=వేఁడిమిచేత, అర్దిత ఐ=కమలినదై, అలయక = శ్రమచెందక, పుణ్యవ్రతములు=మేలుగావించెడినోములు, సలుపుచున్ = చేయుచు, సైరంధ్రి అనఁగన్ = సైరంధ్రి యనుపేరుతో, ఉండెను.

121. అటన్=అడవిలో, నలుఁడు, దమయంతిని, పాసి, దారుణ అరణ్యములోన్ = భీకరమైన యడవిలో, అరుగువాఁడు = పోవుచు, ముందటన్ = ఎదుట. (పై వ. అ.)

122. దవదహనంబు = కాఱుచిచ్చు, అవిరళవిస్ఫులింగ నివహంబులన్=దట్టములైన మిణుఁగురుల రాసులచేత, అభ్రపథంబున్ = ఆకాశమార్గమున, అంటుచున్ = తాఁకుచు, ఉదగ్రతరుదాహము చేయుచున్ ఉన్నన్ = ఎత్తైన చెట్లను గాల్చుచుండఁగా, మానవపతి = నలుఁడు, దానియంతరమునన్ = ఆ మంటనడుమ, నరనాథ = ఓరాజా, నన్నున్, గారవమునన్=ప్రేమతో, వేగ=త్వరగా, కావన్ = రక్షించుటకు, ఇటన్=ఇచ్చటికి. రమ్ము, అను, ఆర్తమహానినాదమున్=నొచ్చిన గొప్పధ్వనిని. (పై వ. అ.)

123. విని=ఆలకించి, శంకింపక = జంకక, చెచ్చెరన్ = వేగముగా, అనఘుఁడు = పాపరహితుఁడైన నలుఁడు, అతి ఉదగ్రదవానలమధ్యంబునకున్ - అతి = మిక్కిలి, ఉదగ్ర = హెచ్చిన, దవానల = కాఱుచిచ్చుయొక్క, మధ్యంబునకున్ = నడుమునకు, అరిగి, దీనఆననున్ = దేవురింపు మోముగలవానిని, కుండలిత అంగున్ = చుట్టచుట్టికొనిన మేనుగలవానిని, ఒక్కనాగకుమారున్ = ఒక్క చిన్నపామును, కనియెన్.

124. ఆనాగకుమారుఁడు=ఆపాఁపకూన, కృత అంజలి ఐ=చేతులుగట్టుకొన్నవాఁడై, ఏను, కర్కోటకుండు అనువాఁడను, కర్మవశంబునన్ = పాపకర్మవశముచేత, ఒక బ్రహ్మఋషిన్=ఒక బ్రాహ్మణుఁడయి ఋషియైనవానిని, ఉల్లంఘించి = మీఱి, తత్ శాపంబునన్ = ఆమునిశాపంబువలన, ఎక్కడన్=ఎచ్చోటికిని, కదలన్-నేరక = కదలఁజాలక, ఉన్నవాఁడను.

125. నాలుగుదెసలన్ = నలువైపులను, దావజ్వాల ఆవళి=కాఱుచిచ్చుమంటలయొక్కగుమి, కవిసెను=చుట్టుకొనెను, మండి, చాన్=చావను, ఓపన్=చాలను, మహీపాలక=ఓరాజా, నన్నున్, ఒక సరసీకూలమునన్=ఒక చెఱువు గట్టును, చేరంగన్=చేరునట్లు, దయన్=ప్రేమతో, ఎత్తికొనిపొమ్ము.

126. నన్నుఁ, రక్షించినన్=కాపాడినట్లయిన, నీకుఁ, ప్రియంబు, చేయన్ ఓపుదును=చేయఁజాలుదును. అనినన్, వానిని=ఆకర్కోటకుని, ఎత్తికొనిపోవన్, చులకనై=తేలికయై, అంగుష్ఠమాత్రశరీరుఁడు=బొటనవ్రేలంత శరీరము కలవాఁడై, ఉన్నన్=ఉండఁగా, ఎత్తికొని, నలుఁడు, అతిత్వరితగతిన్=మిక్కిలి వేగముగల నడకతో, అరిగి=పోయి, దావవర్జితము=కాఱుచిచ్చు లేనిది, ఐన, ఒక్క, సరోవరసమీపంబునన్ = చక్కనికొలనియొద్ద, విడువన్ పోయినన్=విడిచిపెట్టఁబోఁగా, ఇంకను, పది అడుగులు, అరుగుము. నీకున్, శ్రేయఃప్రాప్తిన్, చేసెదను = మేలొనరించెదను. అనినన్, అడుగులు, ఎన్నికొనుచున్=లెక్కపెట్టుచు, పోయి. పదియవ అడుగునన్=పదవయడుగు పెట్టునప్పుడు, ఆపాముచేతన్, దష్టుఁడు ఐ=కఱవఁబడినవాఁడై, తనరూపంబు విడిచి, వికృతరూపంబుతోన్=మాఱువేసముతో, ఉన్న అనలునకున్, కర్కోటకుఁడు, ఆత్మరూపంబు=తనస్వరూపము, చూపి, ఇట్లు, అనియెన్. అయ్యా, ఓనలమహారాజా, నీవు, నాచేన్, విషపీడితుండవు=విషముచే నొప్పింపబడినవాఁడవు, ఐతివి, అని, దుఃఖింపవలదు, నిన్నున్, ఒరులు = ఇతరులు, ఎఱింగినన్=తెలిసికొనిరేని, ఎగ్గు=కీడు, అగున్, కావున, వికృతశరీరున్ = మాఱినయాకారంబుగలవానినిఁగా, చేసితిని. ఎంత కాలంబు నీశరీరంబునన్, నావిషంబు, ఉండును=ఉండునో, అంతకాలంబును = అంతవఱకును, నీకున్, విషో...భయంబు-విష ఉరగ=విషముగల పాములు, రాక్షసులు, పిశాచులు, శత్రువులు వీరివలని భయము, లేదు. సర్వసంగ్రామజయంబును=అన్నియుద్ధంబులయందు గెల్పును, భార్యాసంగమంబును=భార్యతోఁగూడికయు, ఎప్పటియట్లు ఆ = యథాప్రకారముగా, రాజ్యవిభవంబును = రాజ్యసంపదయును, అగును. నీకున్, ఎప్పుడేనిన్ = ఎప్పుడైనను, నిజరూపంబు = స్వకీయరూపమును, చేకొనన్=కైకొనుటకు, ఇష్టంబు=కోరిక, అగున్=కలుగునో, అప్పుడు అ=ఆక్షణమే, నన్నున్, తలంపుము. ఈవస్త్రంబు, నీయొద్దకున్, వచ్చును. దీనిన్, ధరియించుడున్ = కట్టుకొనఁగా, నిజరూపప్రాప్తి = సొంతరూపము పొందుట, అగున్, అని, చెప్పి, వెండియున్, ఇట్లు, అనియెన్.

127. ఇలన్=భూమియందు, ఇక్ష్వాకుకులజుఁడు = ఇక్ష్వాకువంశమునఁబుట్టినవాఁడ, ప్రసిద్ధుఁడు = కీర్తిచెందినవాఁడు, అగు, ఋతుపర్ణుఁడు, అనెడు మహీశుఁడు = రాజు, (కలఁడు, అతఁడు,) నీకున్ = నీచేత, సంసేవ్యుఁడు=చక్కఁగాఁ గొలువఁదగినవాఁడు, అగున్, అతనిన్=ఆఋతుపర్ణుని, కొలిచి, అందున్=ఆతనియొద్ద, అలయక=బడలిక నొందక, ఉండుము, ఈవు, అతనికిన్, అశ్వహృదయఆఖ్యము అగు విద్య=అశ్వహృదయ మను పేరు గల విద్యను, ఇచ్చి = ఉపదేశించి, ఆతనిచేన్ = ఆతనివలన, అక్షహృదయము అను విద్యన్, చేకొనుము = గ్రహింపుము.

128. మఱియు, బాహుకుండు అను, నామంబుతోన్ = పేరితో, సూతవృత్తిన్=సారథ్యముచేయు కొలువునందు, ఉండుము, అని, హిత, ఉపదేశంబుచేసి=మేలుపలుకులు చెప్పి, కర్కోటకుండు, అదృశ్యుఁడు ఐనన్= కనఁబడకపోఁగా, తత్ వచనంబునన్ = ఆకర్కోటకుని మాటచొప్పున, నలుండు అయోధ్యాపురంబునకున్, చని, ఋతుపర్ణున్, కని, ఏను, బాహుకుండు, అనువాఁడను. అశ్వశిక్షయందున్ = గుఱ్ఱములను చక్కఁజేయుట యందు, కుశలుఁ డను=నేర్పరిని. అన్నసంస్కారంబును = వంటచేయుటయు, శిల్పంబులు పెక్కులు = చేతిపనులు అనేకములు, రచియింపన్ - నేర్తున్= చేయఁగలను. భవత్ సేవ అర్థిని ఐ=మీవద్ద కొలువుఁ గోరినవాఁడనై, వచ్చితిని. అనినన్, వానికిన్, ఋతుపర్ణుండు, ఇట్లు అనియెన్.

129. నాయొద్దన్, ఉండెదు ఏని=ఉందువేని, మదీయ...ధృతి - మదీయ=నావైన, రథఅశ్వ = తేరిగుఱ్ఱములయొక్క, గమన=పోకలయందు, ధృతి=దిట్టతనమును, శీఘ్రముగాన్ = త్వరగా, చేయుము = కలిగింపుము. నావుడున్=చెప్పఁగా, అట్టులు అ = ఆ ప్రకారమే చేసెదను. అని, నలుఁడు, వానిన్ = ఆఋతుపర్ణుని, మదిన్ = అపేక్షతో - ఇష్టముతో, సేవింపన్= కొలిచెను.

130. ఇట్లు, ఋతుపర్ణునొద్దన్, అశ్వ అధ్యక్షుఁడై=గుఱ్ఱముల విచారణాధికారియై దుష్టాశ్వంబులన్ = చెడ్డగుఱ్ఱములను, వశగతంబులన్ చేయుచున్=లోఁబఱచుకొనుచు, అశ్వవరంబులన్=మేటిగుఱ్ఱములను, ఆరోహణంబులన్=సవారులకు, శిక్షించుచున్=నేర్పుచు, రసవంతంబుగన్=రుచికలిగియుండునట్లు, అన్నసంస్కారంబు - చేయుచున్=వంటవార్పులు చేయుచు, ఋతుపర్ణనియుక్తుఁడు=ఋతుపర్ణమహారాజుచే నేర్పఱుపఁబడినవారు, అయిన, వార్ష్ణేయజీవలులు=అను పేరుగలవారు, తనకున్, సహాయులు కాన్ = తోడైయుండఁగా, ప్రచ్ఛన్నుండై ఉండి = మఱుఁగువడియుండి, ఒక్కనాఁడు, ఏకాంతంబునన్ = ఏకతంబునందు, దమయంతిన్, తలపోసి=తలంచుకొని, తనరాకన్=తాను విడిచివచ్చుటను, తలఁచి = ఎంచుకొని. (పై ప. అ.)

131. ఇభరాజగమన=మేటియేనుఁగువంటి నడకగలదానా, నీవు. ఎందులకున్, అరిగితివి. ఉడురాజవదన=చంద్రబింబమువంటి ముఖముగలదానా, ఎందున్, ఉన్నదానవు. అబల=ఓచిక్కినదానా, అడవులలోన్ = అడవులయందు, ఎవ్వరిచేతన్, పట్టువడితి=చిక్కికొంటివి. అశనాపేక్షన్=ఎరమీఁదికోరికతో, పఱచుచున్న ఉగ్రమృగంబుల ఉదరంబులోన్=పరుగెత్తుచుండు భయంకరమృగంబుల కడుపులలోపల, ఉన్నదానవే = ఉన్నావా? నీ తల్లి తండ్రుల కడన్, ధృతిన్=ధైర్యముతో, ఉన్నదానవే. దేశాంతరంబులన్= ఇతరదేశములందు, ఉన్నదానవే = ఉన్నావా. అంచున్=అని చెప్పుచు, నలుఁడు, శోకము, ఉత్కటముగాన్=హెచ్చుఁగా, ఉదిత...త్ముఁడై-ఉదిత= హెచ్చిన, మదన=మన్మథబాధచేత, విమోహిత=మైమఱపు గలిగిన, ఆత్ముఁడై-మనస్సుగలవాఁడయి, హృదయ ఈశ్వరిన్ = దమయంతిని, తలఁచి, రాత్రియెల్లన్=రాత్రియంతయు, తాపమునను=మన్మథసంతాపముచే నిద్ర, లేక, వంది=వాడుపాఱి, నిట్టూర్పులు ఊర్చుచున్=విడుచుచు ఉండెను.

132. అతని ప్రలాపంబు = అతఁడు పదరుటను, విని, జీవలుండు, అత్మగతంబునన్ = తన మనస్సులోపల.

133. ఇతండు=ఈబాహుకుఁడు, అణఁగారఁడుఁగాఁ=నగముగూనును, కుఱుచచేతులు = పొట్టిచేతులును, ఒఱవశరీరమును = వంకరమేనును, కలిగి ఒరులకున్ = ఇతరులకును, చూడన్ కొఱ గాక ఉండియున్ = చూచుటకు సహ్యముగానున్నను, యువతీప్రియుఁడు ఐ = వయసు చిన్నదాని కిష్టుఁడై, మన్మథునొప్పులన్=మన్మథబాధలయందు, పడియెడున్ = చిక్కియున్నాఁడు.

134. పిలిచేతన్, వరియింపఁబడియెడు వనిత = కోరఁబడు సుందరి, పిలిచంటేన్, చెప్ప=...వమయినదో, కాకయున్నె=కాకుండునా, అనుచున్, బాహుకునొద్దకున్, వచ్చి, సితలఁచుచున్న భార్యకున్ = సీవు స్మరించెడి భార్యకును, నీకున్, ఏల, వియోగంబు = ఎడఁబాయుట; అయ్యెను=కలిగెను. అని, అడిగెన్. బాహుకుండు, ఇట్లు, అనియెన్.

135. సన్నున్, చూచి, నగరు ఎ=(జనులు) నవ్వరా? నలినాక్షి= కమలనేత్రయగు సుందరి నాకున్, ఏల = ఎందుకు, విప్రయోగము = ఎడఁబాయుట, ఏల; వినవే. (వినుము-ఏ)=వినుమయ్యా, ఏలకో=ఎందుకో, నేను, ఎఱుఁగను, తొల్లి = మునుపు, మందప్రజ్ఞుఁడు (మూఢబుద్ధిగలవాఁడు) అను భటుండు=అను బంటు, తన లతాంగిన్=తన ప్రియురాలిని, పాసి.

136. దానిన్, అన్వేషించి=వెదకి, ఎందును = ఎచ్చటను, కానక, ప్రలాపించినన్=విలపింపఁగా, తత్ప్రకారంబు=ఆరీతిని, ఏను, అనుకరించితిని= నటించితిని. అని, చెప్పి, ఇట్లు, అయోధ్యాపురంబునన్=అయోధ్యాపట్టణమునందు, బాహుకనామంబుతోన్=బాహుకుండనెడిపేరితో, ప్రచ్ఛన్నుఁడు ఐ=మఱుఁగినవాఁడై, నలుఁడు, ఉండెను. అంతన్=తర్వాత, అటన్=అచ్చట, విదర్భఈశ్వరుఁడు = విదర్భరాజగు భీముఁడు, నలురాజ్యభ్రంశంబు=నలుని రాజ్యము కోల్పోవుటను, విని, కూఁతురును, అల్లుఁడును, ఎటన్ = ఎచ్చటికిఁ బోయిరో, ఎట్లు ఉన్నవారో, అని, శోకించి=విలపించి.

137. అపారబలుఁడు=మేరలేని బలముగలవాఁడు, (భీముఁడు) సదాచారులన్=చక్కని యాచారముఁ గలవారిని, విద్వాంసులన్=అన్నిటిని దెలిసినవారిని, ఇష్టులు ఐన బ్రాహ్మణులను=తనయందుఁ బ్రేమగల బ్రాహ్మణులను, సత్కారంబులన్=మర్యాదలచే, తనిపి=తృప్తినొందించి, వారిన్=బ్రాహ్మణులను, కడు నెయ్యముతోన్=ఎక్కువ యుత్సాహముతో, వారలన్=ఆ నలదమయంతులను, రోయఁగన్=వెదకుటకై, పంచెన్=పంపెను.

133. మఱియు, నల దమయంతులు, ఉన్నచోటు, ఎఱింగి, వచ్చినవారికిన్, వేయిగద్యాణములు=వేయివరహాలు, ఇత్తును. అనియుఁన్, వారలన్, తోడ్కొని=పిల్చుకొని, వచ్చువారికిన్, గోసహస్రంబులు=పెక్కు గోవులును, అగ్రహారంబులును=మంచి గ్రామములను, ఇత్తును అనియు, పలికి, పంచినన్=పంపఁగా.

139. జగతీదేవసత్తములు=బ్రాహ్మణశ్రేష్ఠులగువారు, నిఖిలదేశములకున్=అన్ని దేశములకును, వడిన్=వేగముగా, అరిగి, జగతీచక్రమునన్=భూమండలమునందు, కల=ఉన్న, నగర...ణంబులు - నగర=పట్టణములు, మహాగ్రామ=గొప్ప యూళ్లు, పక్కణంబులు=పల్లెలు, కలయన్=అంతటను, ఇమ్ముగన్=చక్కఁగా, రోసిరి=వెదకిరి.

140. అందున్=వారిలో, సుదేవుండు, అను బ్రాహ్మణుండు, చేదిపతి=చేదిదేశపురాజు, ఐన సుబాహుపురంబునకున్, చని, పుణ్యాహవాచనంబు=ఇంటి యశుచిత్వము తొలఁగుటకై చేయు నొక కర్మవిశేషమును, చేయింపఁబోవు బ్రాహ్మణులతోన్, రాజగృహంబు=రాచనగరు, చొచ్చి, అంతఃపురంబునన్, సునందాసహిత ఐ=సునందతోఁగూడినదై, ఉన్నదానిన్=ఉన్నదియు, ధూళిధూసర ఐ=దుమ్ముచేఁ గప్పఁబడినదై, ధూమ...బద్ధ ఐన - ధూమ=పొగలయొక్క, జాల=కూటముచేత, నిబద్ధ ఐన=క్రమ్మఁబడినదియగు, అగ్నిప్రభయుం బోలెన్=నిప్పుమంట వలెను, నీల...తంబు ఐన - నీల=నల్లని, అభ్ర=మేఘములచేత, సంవృతంబు అయిన =

కప్పఁబడినది యగు, చంద్రరేఖవలెను, బహు...నిమగ్న ఐన - బహు = విస్తారమైన, పంక=అడుసునందు, నిమగ్నఐన = మునిఁగిన, మృణాళియుంబో లెన్ = తామరతూఁడువలెను, ఏర్పడకఉన్నను = స్పష్టముగాఁ దెలియకున్నను, తదీయ...తంబు ఐన - తదీయ = దానివగు, భ్రూ = కనుబొమ్మల, యుగ=జంటయొక్క, మధ్య=నడుము, గతంబుఅయిన=ఉన్నట్టి, సూక్ష్మ లక్షణంబు=సన్నని మచ్చను, ఇమ్ముగాన్=బాగుగా, నిరీక్షించి, దమయంతికిన్ - ఎఱింగి, ఇది, పతివియుక్తయై = భర్తనుబాసి, శుష్కప్రవాహంబు ఐన=నీటి పాఱుదల లేని, నదియున్ పోలెన్ = ఏటివలెను, శూన్యకమలంబు = తామరపువ్వులు లేని, నళినియున్ పోలెన్ = తామరతీఁగవలెను, ఒప్పకుండియున్ = ప్రకాశింపకుండినను, తన పతివ్రతాత్వంబునన్=తన పాతివ్రత్యముచేత, ఒప్పుచున్నది = ప్రకాశించుచున్నది.

141. భామలకున్=స్త్రీలకు, పతిభక్తి అ=మగనియందుఁ బ్రేమయే, అనపహార్యంబు=శత్రువులచే దొంగిలింపరానిదియు, తేజోమయంబున్ = కాంతిస్వరూపమైనదియు, సర్వగుణంబులకున్=అన్నిసుగుణములకును, గురుతరంబు=మిక్కిలి ముఖ్యమైన, అలంకారంబు=సొమ్ము, పరమము ఐన=గొప్పదైన భూషణము, పెఱభూషణములు = తక్కిన సొమ్ములు, ఇట్టివే = ఈలాగుండునవియా. (కా వనుట.)

142. రోహిణికిన్ = రోహిణీదేవతకు, చంద్రసమాగమంబునుంబోలెన్=చంద్రునితో కూడికవలె, దీనికిన్, భర్తృసమాగమంబు=పెనిమిటితోడికూడిక, ఎన్నడు, అయ్యెడున్ ఓ=కలుగనున్నదో, తుల్య...జాత్యులు- తుల్య=సమానమైన, శీల = మంచినడవడి, వయః=ఈడు, రూప=ఆకారము, అభిజాత్యులు=సత్కులంబునఁ బుట్టుక యనునవి గలవారలు, ఐన నల దమయంతులు, ఒక్కటన్=ఒక్కచోట, ఉండన్ = ఉండఁగా, చూచి, విదర్భేశ్వరుఁడు = భీముఁడు, ఎన్నండు, కృతార్థుఁడు = కోరిన కోరికను పూర్తిచేసికొన్నవాఁడు, అయ్యెడున్ ఓ = కాఁగలఁడో, అంచున్ = అని యెంచుచు, అల్లన్ అ = మెల్లగా, ఇట్లు, అనియెన్.

143. అవ్వ=అమ్మా, నీ తల్లిదండ్రులకున్, ఆత్మజులకున్=బిడ్డలకు, బంధుజనులకున్ =చుట్టములకును, కుశలంబు అ=క్షేమమే, భామ=ఓసుందరీ, వారు, నీదుకుశలము = నీక్షేమము, ఎఱుఁగునంతకున్ = తెలియువఱకు, వగన్ దూరి = విచారంబునొంది, వగచుచున్నవారు=దుఃఖపడుచున్నారు, ఇంకను, వారలవంత=వారిదుఃఖము, ఉడుగును=తీఱును.

144. దేవీ = ఓరాణీ, విను, భవత్ భ్రాతృసఖుండను=నీయన్నకు స్నేహితుఁడను, సుదేవుండు, అను బ్రాహ్మణుండను. విదర్భఈశ్వరుండు=విదర్భరాజు (నీతండ్రి), నీయున్నచోటు=నీవున్నతావు, ఎఱుంగన్, పెక్కండ్రు=అనేకులను, బ్రాహ్మణులను, పుచ్చినన్ = పంపఁగా, నేను, ఇందులకున్ = ఈపురంబునకు, వచ్చి, నాపుణ్యంబునన్ = నాయదృష్టవశంబున, నిన్నున్, కంటిని, అనినన్, దమయంతి, వానిన్=ఆ సుదేవుని, ఎఱిఁగి=ఆనవాలుపట్టి, తన తలిదండ్రులన్, బాంధవులన్, ప్రత్యేకంబు ఆ = వెవ్వేఱుగా, (కుశలంబు=క్షేమము) అడిగి, అశ్రుజలంబులు = కన్నీరు, ఉరులన్=దొర్లునట్లు, విడ్చుచున్నన్, చూచి, ఏలకో (ఏలకున్ ఓ)=ఎందుకో, ఇప్పుడు, సైరంధ్రి, విడ్చుచున్న యది, అని, సునంద, రాజమాతకున్, చెప్పిపుచ్చినన్ = చెప్పి పంపఁగా.

145. వారిజదళలోచన = తామరఱేకులంబోలు కన్నులు గలదగు, రాజమాత=రాజుగారితల్లి, వనితానివహంబుతోడన్=స్త్రీలగుంపుతోఁగూడ, అంతిపురంబునన్ = అంతఃపురంబునందు, ఉన్న, నృపనందన అగు = రాజపుత్రియగు, దమయంతికడకున్, తద్దయున్ = మిక్కిలి, వేడ్కన్=ఉత్సాహముతో, చనుదెంచెను.

146. ఇట్లు వచ్చి, తమలోన్=వారి లోలోపల, మాటాడుచున్న బ్రాహ్మణునిన్, దమయంతిన్, చూచి, రాజమాత, ఇట్లు అనియెను. అయ్యా=ఓబ్రాహ్మణుఁడా, ఇది, ఎవ్వనికూఁతురు, ఎవ్వనిభార్య, ఏమికారణంబునన్=ఏ హేతువుచేత, తన భర్తను, బాంధవులను, పాసి, పుణ్యవ్రతంబులు=పుణ్య

ప్రదములైననోములు, సలుపుచున్నయది=చేయుచున్నది. దీనిని, నీవు, ఎట్లు, ఎఱింగితివి, ఈకోమలినామంబు=ఈచిన్నదానిపేరు. ఏమి, అని, అడిగినన్, సుదేవుండు, ఇట్లు, అనియెన్.

147. నలినఅక్షి=తామరరేకులవంటికన్నులుగల యోరాజమాతా, ఇది, విదర్భఈశుతనయ = విదర్భరాజు కూఁతురు, పుణ్యశ్లోకుఁడు = పావనమైన కీర్తిగలవాఁడు, ఐన, నలుదేవి = నలునిరాణియగు, దమయంతి సుమ్ము= దమయంతి కదా. విధికారణంబునన్ = దైవముయొక్క యాగ్రహంబు వలన, నిజనాథుఁడు = తనపెనిమిటి, రాజ్యచలితుఁడు ఐ = రాజ్యమునుండి భ్రష్టుఁడయి, అరుగన్=పోవఁగా, తోడనే=వెంబడే, చనెను. అను, వార్త= వృత్తాంతము, వెలయంగన్ = బాగుగా, విని. భూవిభుఁడు = విదర్భరాజు, బ్రాహ్మణులను, వారిని, రోయన్=వెదకుటకై, పంపెను.

148. ఏను, ఇందులకున్ = ఇచ్చటికి, వచ్చి, మీచేతన్, సురక్షిత ఐ ఉన్న ఈ కోమలిన్ = చక్కఁగాఁ గాపాడఁబడుచున్న యీసుకుమారిని, చూచి, దీని భ్రూమధ్యంబునన్ = దీనియొక్క కనుబొమలనడుమ, పద్మనిభంబై = కమలంబుఁ బోలినదై, విభూతి అర్థంబుగాన్ = సంపదకొఱకు, విధాతృనిర్మితంబు = బ్రహ్మచేఁ జేయఁబడినది, ఐన పుణ్యలక్షణంబు = శుభచిహ్నము, పాంసుపటలచ్ఛన్నంబు ఐ ఉన్నన్ = దుమ్ముయొక్కరాశిచేఁ గప్పఁబడినది యై యుండఁగా, ఉపలక్షించి=చూచి, రాజపుత్రిన్ కాన్= దమయంతినిగా, ఎఱింగితిని, అనినన్, సునంద, శుద్ధఉదకములన్ = తేటనీటితో, దాని భ్రూమధ్యంబున్=దాని కనుబొమలు నడుమను, కడిగినన్= కడుగఁగా, అవి, విస్పష్టంబు అగుడున్ = స్పష్టముగాఁ దెలియఁగా, అందఱును, ఆశ్చర్యము నొందిరి. అంతన్=తర్వాత.

149. రాజమాత=రాజుగారితల్లి, ఆనందభరిత ఆత్మ ఐ = సంతోషముతో నిండిన మనస్సుతోఁ గూడినదై, ఆ కమలాక్షిన్ = ఆదమయంతిని, ప్రీతితోన్ = గారాబముతో, కౌఁగిలించికొని, తల్లీ = ఓచిన్నదానా, నీవు, నాకూఁతురవు, ఏనున్, నీజననియుఁన్=నీతల్లియుఁ, పేర్మిన్, దశార్ణ మహా

